మూడాశ్వాసములును గలవు. చివర బాలసూర్యోదయమును గూర్చిన సంస్కృతశ్లోకము తెలుగు టీకయు గలవు. ఈప్రతి యందు రసముల పుట్టుక, శిద్ధుల గూర్చిన వివరములు కలవు.

ప్రతి కొంత శిథిలమగు చున్నది, కొన్ని అక్షరములు నశించినవి. లిపి స్పష్టము. ప్రతి విలేఖనమున దోషములు గలవు. ఇది సమగ్ర వైద్యగ్రంథము.



# ఛందస్సు

| క్రమ సంఖ్య | వ్రాతప్రతి పేరు | కవి పేరు | తాళపత్రము లేదా కాగితము | సమగ్రము లేదా అసమగ్రము | క్రమానుగత గ్రంథసంఖ్య (అక్సెషన్ నెంబర్) |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1 | అనంతుని ఛందము | అనంతామాత్యుడు | కాగితం | అసమగ్రం | 4034 |
| 2 | అప్పకవీయము | అప్పకవి | తాళపత్రం | ,, | 4003 |
| 3 | అప్పకవీయము | ,, | ,, | ,, | 4022 |
| 4 | కవి గజాంకుశము—కవిజనాశ్రమము—సులక్షణసారముల నుండి కొన్ని పద్యములు | భైరవకవి—భీమకవి—తిమ్మకవి | ,, | ,, | 4684 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5 | కవి చింతామణి | వెల్లంకి తాతంభట్టు | కాగితం | సమగ్రం | 55 2 |
| 6 | ఛందో గ్రంథము | చేకుమళ్ళరాజగోపాలరావు | ,, | అసమగ్రం | 2246 |
| 7 | ఛందో గ్రంథము | - | ,, | ,, | 3894 |
| 8 | ఛందో గ్రంథము | — | తాళపత్రం | ,, | 5670 |
| 9 | ఛందో దర్పణము | అనంతామాత్యుడు | ,, | ,, | 770 |
| 10 | ఛందో దర్పణము | ,, | ,, | ,, | 5669 |
| 11 | తిమ్మకవి లక్షణము | తిమ్మకవి | ,, | ,, | 3672 |
| 12 | సుకవిమనోరంజని | — | ,, | ,, | 5617 |
| 13 | సులక్షణసారము | లింగమగుంట తిమ్మకవి | ,, | ,, | 527 |
| 14 | సులక్షణసారము | ,, | ,, | ,, | 3405 |



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
పరిశోధనాలయంలో భద్రపరచబడిన
వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటాలగ్)

---

| | | |
|---|---|---|
| 1. | ఆక్సెషన్ నెంబర్ : 5552 | కాల్ నెంబర్ : T 8—3 |
| 2. | గ్రంథం పేరు | కవి చింతామణి |
| 3. | కవి పేరు | వెల్లంకి తాతంభట్టు |
| 4. | విషయం | ఛందోగ్రంథము |
| 5. | వ్యాఖ్యాత పేరు | .... |
| 6. | తాళపత్రప్రతి/కాగితం ప్రతి | కాగితపు ప్రతి |
| 7. | (అ) భాష, లిపి | తెలుగు |
| | (ఆ) ప్రతివ్రాసిన తేది | — |
| 8. | ఆకుల/పుటల సంఖ్య | 73 |
| 9. | సమగ్రమా/అసమగ్రమా ? | సమగ్రము |

10. ప్రారంభం :

కం. సర్వములు నచ్చులు ననగా
నరయ నకారాదిగా గల యక్షరముల్
యరలవ లంతస్థలు భా
స్వరముగనై యొరలు వృద్ధి శషసహ లూష్మల్.

ఆ.వె. వ్యంజనములు........
ఙాంతమైన వర్గ నంచయంబు
నుడుగు సున్న బొట్టనుస్వార మనుపేర
స్పర్శలనగ వర్గపంచకంబు.

కం. పరువడి జ మనణము లకున్
ధరపై ననునాసికాభిధానము చెల్లున్
తిరముగ వలపల సున్నల
కరుదార విసర్గ సంజ్ఞ కహిపతి శయనా.

కం. విమలంబుగ నాకారాం
తమునకును తదాత్త సంజ్ఞత నిడుదురు శా
స్త్రముల బుధుల్ పొల్లతకా
రము వర్ణోద్దేశముల స్వరంబుల మీదన్.

 

11. ముగింపు ;

అసదృశోపమ :—

కం. పూజితులతోడ నీచుల
నోజగ నుపమింప నసదృశోపమ జగతిన్
రాజు ——— రున్ బలి
భోజత్వము ననిన కాకి భూవినుత మగున్.

రాజుతోడి ఉపమ కాకికి — అధికోపమ.

అప్రసిద్ధోపమ :—

కం. సమకూడ దప్రసిద్ధో
పమ కవికవి ———— పదజాతముతో
సమముగ నుపమించిన యది
ప్రమద మొగం బలరు చుక్క పగిదిం జూడన్.

కం. వదలక యర్థము కందులు
పదు నెనిమిది జగతి కలదు పాపాధికముల్
మదివాని నెఱిగి కబ్బము
పదిలముగా జెప్ప వలయు బ్రఖ్యాతముగన్.

కం. ————————— కామా నాధిక
విదితాలంకార శాస్త్ర విశదములగు న
ర్వాది దోషంబు లలోకిం
చిదకంబులు మాని కొన్ని చెప్పితి తెలియన్.

 

12. ఆశ్వాంసాంతగద్య :

ఇది వినుత విద్యావిశారద వెల్లంకి తాతంభట్ట ప్రణీతంబైన కవి చింతామణీ కావ్యానుశాసనంబున దోషాధికారము.

 

13. విశేషములు (రిమార్క్సు) :

ప్రతి విలేఖనము : సర్వధారి నామ సంవ్వాత్సర భాద్రపద శు 15 జయవారం.

ఇది కవి చింతామణి యను కావ్యానుశాసన గ్రంథము యొక్క కాగితపు ప్రతి. ఇది వెల్లంకి తాతంభట్ట ప్రణీతము. ఒక్కొక్క అధ్యాయాంత మున గలగద్యలో దానికి తగినట్లుగా ఈ కవికి గల ఒక్కొక్కబిరుదు పేర్కొన బడినది. అష్టభాషావతార, శబ్దవర్ణనీయ, సారసాహిత్య, వినుతవిద్యావిశా రద యనున వీ బిరుదులు.

ఈ గ్రంథమున భాషాలక్షణాధికారము, వర్ణనీయాధికారము, వళిప్రాసాధికారము, దోషాధికారము అను నాలుగు అధ్యాయములు కలవు.

ఈ ప్రతి బాగున్నది. లిపియు స్పష్టము. కాని ప్రతి విలేఖనమున చాలా చోట్ల అక్షరములు—పదములు వదిలివేయబడి ఖాళీ స్థలములు వుంచబడినవి.



# వ్యాకరణము

| క్రమ సంఖ్య | వ్రాతప్రతి పేరు | కవి పేరు | తాళపత్రము లేదా కాగితము | సమగ్రము లేదా అసమగ్రము | క్రమానుగత గ్రంథసంఖ్య (అక్సెషన్ నెంబర్) |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. | అధర్వణకారికావళి | అధర్వణాచార్యుడు | తాళపత్రం | సమగ్రం | 3401 |
| 2. | ఆంధ్రకావ్యార్ణవోడుపము | — | ,, | ,, | 5888 |
| 3. | ఆంధ్ర భాషాభూషణము | కేతన | కాగితం | ,, | 1930 |
| 4. | ఆంధ్రశబ్దచింతామణి | నన్నయభట్టు | తాళపత్రం | ,, | 342 |
| 5. | ఆంధ్రశబ్ద చింతామణి-వాసుదేవవృత్తి | మంచెళ్లవాసుదేవకవి | ,, | ,, | 3399 |
| 6. | ఆంధ్రశబ్దచింతామణి | నన్నయభట్టు | ,, | ,, | 3400 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 7. | కవిశిరోభూషణము అహోబల పండితీయము | అహోబల పండితుడు | తాళపత్రం | అసమగ్రం | 454 |
| 8. | కవిశిరోభూషణము | ,, | కాగితం | సమగ్రం | 1932 |
| 9. | కవిశిరోభూషణము | ,, | ,, | అసమగ్రం | 3732 |
| 10. | తెలుగు పదములలోని మార్పులు | — | ,, | ,, | 2257 |
| 11. | ద్రావిడభాషలపట్టిక | — | ,, | ,, | 2250 |
| 12. | వైకృత చంద్రిక | మంచెళ్ల వాసుదేవకవి | ,, | సమగ్రం | 5576 |
| 13. | శకటరేఫ ప్రకరణము | — | ,, | అసమగ్రం | 2253 |
| 14. | హరికారికలు | — | ,, | సమగ్రం | 1931 |

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
పరిశోధనాలయంలో భద్రపరచబడిన
వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటలాగ్)

---

1. ఆక్సెషన్ నెంబర్ : 1930 — కాల్ నెంబర్. T. 9-6
2. గ్రంథం పేరు — ఆంధ్రభాషా భూషణము
3. కవి పేరు — కేతన
4. విషయం — వ్యాకరణము
5. వ్యాఖ్యాత పేరు — ———
6. తాళపత్రప్రతి/కాగితం ప్రతి — కాగితపు ప్రతి
7. అ) భాష, లిపి — తెలుగు
   ఆ) ప్రతివ్రాసిన తేది — ——
8. ఆకుల/పుటల సంఖ్య — 17
9. సమగ్రమా/అసమగ్రమా ? — సమగ్రము
10. ప్రారంభం :

శా. శ్రీవాణీ గిరిజేశ దంతిముఖ రాజీవాప్తులం గొల్చి వా
గ్దేవిం జిత్తములోన నిల్పుకొని శక్తి నే భక్తి గీర్తించి నా
నావిద్వజ్జనులం మదిం దలచి నూత్న ప్రౌఢకావ్యక్రియా
ప్రావీణ్యంబున నుల్లసిల్లు కవులం బ్రార్థించి ధన్యుండనై.

క. వివిధకళానిపుణుడ నభి
నవదండి యనంగ బుధజనంబులచేత నే

ఘుపి బేరుకొన్నవాడను
కవిజనమిత్రుండ మూలఘటికాన్వయుడన్.

క. ఖ్యాతశుభచరితు డన వృష
కేతన పాదద్వయీ నికేతను డనగా
కేతన యన సత్కవి యన
భూతలమున నతిశయంబు బొందినవాడన్.

ఆ. వె. కవితజెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతడు మెచ్చ
బరగు దశకుమారచరితంబు చెప్పిన
ప్రోఢ నన్ను వేరె పొగడనేల.

తే. గీ. మున్ను తెనుగునకు లక్షణ.........
మెన్నడు నెవ్వరను జెప్పకునికి యెల్ల
కవి జనంబుల నేరమిగాదు నన్ను
ధన్యుగావింప దలచిన తలపుగాని.

క. భాషావేదులు నను విని
యాషణ్ముఖ పాణినులకునగు నే యని సం
తోషింప నాంధ్రభాషా
భూషణ మను శబ్దశాస్త్రమున్ గావింతున్.

క. ఒప్పులు గలిగిన మెచ్చుడు
తప్పులు గలిగిన నెరింగి తగదిద్దుడు త
ప్పొప్పనుచు నొప్పుతప్పని
చెప్పకుడీ కవులుపాస్తి జేసెద మిమ్మున్.

క. గుణదోషంబు లెరింగి ది
గుణ బరిదోషమని పూజగొందురు సుకవుల్
గుణములే దోషములని దు
ర్గుణములె గుణములని పూజగందురు కుకవుల్.

ఉ. క్రొత్తగా నాంధ్రభాషకును కొందొక లక్షణ మిట్లు జెప్ప నే
యుత్తమబుద్ధి వీడె యని యోజలు దీర్పకయున్న మేలు మీ
రొత్తిన మీకు మారుకొని యుత్తర మిచ్చుట చాల వ్రెంగు మీ
చిత్తమునందె నన్నెరవు సేయకుడీ కవులార మ్రొక్కెదన్.

క. నేరములు కాళిదాస మ
యూరాదుల కయిన గలవు యొరులకు లేవే
సారమతు లయిన సుకవుల
కారుణ్యము కలిమినేర్పు కవిజనములకున్.

గీ. కంచి నెల్లూరు మరియోరుగ ల్లయోధ్య
యనుపురంబుల పయి గంగ కరుగుమనిన
పగిది నొకద్రోవచూపెద బహుపదంబు
లాంధ్రభాషకు గలయవి యరసికొనుడు.

ఆ. వె తల్లి సంస్కృతంబు యెల్లభాషలకును
దానివలన గొంతగాననయ్యె
కొంతదాన గల్గెనంతయు నేకమై
తెనుగు బాసనంగ వినుతికెక్కె.

క. తెనుగును గల భేదంబులు
తెలుగై సంస్కృతము చెల్లు తెరగులు తత్సం

ధులను విభక్తులు నయ్యో
యలఘు సమాసములన్ గ్రియలు నెరిగింతున్.

క. ఆదులు స్వరములు నచ్చులు
కాదు లొగిన్ వ్యంజనములు హల్లులనంగా
మేదిని నెల్లెడ జెల్లును
కాదులు నైదైదుకూడ నగు వర్గంబుల్.

 

11. ముగింపు :

క. పెక్కొట నొక క్రియ యిడుచో
నొక్కట దుదినొండె మొదలనుండెను మరి యొ
క్కొక్కటి కొండెను బెట్టుదు
రక్కట క్రియనడుమ బెట్ట నాంధ్రకవీంద్రుల్.

క. కరియరిగె దురగమరిగెను
గరియుందురగంబునరిగె గ్రక్కున నరిగెన్
గరియును దురగము ననదగు
గరియరిగెన్ దురగమనిన గైకొన రార్యుల్.

క. తీవెల ప్రాకుల పేరులు
పూవుల కుంచెళ్ళ మొగలిపువ్వులు దక్కన్
గ్రోవులు మల్లెలు జాజులు
దావిరిదాదులని జెప్పదగు నెక్కలుగన్.

త. మానయు జేనయు లోనగు
నానాపరిమాణములు జనము గొలుచునెడన్
మానెడు జానెడు ననుక్రియ
మానకెడుల నొందుమీద ప్రాయన.........తా.

క. తెలుగునకు లక్షణము భువి
నలవడ నవదండి చెప్పిన విధానములో
పల జెప్పిన క్రియలన్నియు
దెలియుడుసత్కవులు మేలు దేటపడంగన్.

 

12. ఆశ్వాసాంతగద్య :

ఇది శ్రీమదభినవదండి విరచితంబైన యాంధ్ర భాషా భూషణంబు నందు సర్వంబు నేకాశ్వాసము.

 

18. విశేషములు (రిమార్క్సు)

కాగితపు ప్రతి, సమగ్రము, గ్రంథము శిథిలావస్థలో నున్నది. పురాతన ప్రతి. వ్రాత చక్కనిది, వ్రాత దోషములు సవరించబడి యున్నవి. ఒకే ఆశ్వాసము. వ్రాయబడిన కాలము గాని వ్రాయసకాని నామముగాని పేర్కొనబడలేదు. కాగితమున కిరువైపుల వ్రాయబడినది.



# వచన గ్రంథములు

| క్రమ సంఖ్య | వ్రాతప్రతి పేరు | కవి పేరు | తాళపత్రము లేదా కాగితము | సమగ్రము లేదా అసమగ్రము | క్రమానుగత గ్రంథసంఖ్య (అక్సెషన్ నెంబర్) |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | 5 |
| 1 | అప్పకవీయము—తృతీయాశ్వాసవ్యాఖ్యానము | డా. నిడదవోలు వేంకటరావు | కాగితం | సమగ్రం | 5854 |
| 2 | అముద్రితవాఙ్మయ సూచికలు | ,, | ,, | ,, | 5869 |
| 3 | అష్టమూర్తి భావధ్యానము | — | తాళపత్రం | అసమగ్రం | 1628 |
| 4 | ఆంధ్ర వచన మహాభారతము (18 పర్వములు) | — | ,, | సమగ్రం | 374 |
| 5 | ఆంధ్రుల కులములు—వృత్తులు మొదలగునవి | చేకుమళ్ళ రాజగోపాలరావు | కాగితం | ,, | 2254 |

| | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 6 | ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారి జీవితము | డా. నిడదవోలు వేంకటరావు | కాగితం | మగ్రం | 6852 |
| 7 | ఆధునిక యుగము (ప్రథమ ఖండము) | ,, | ,, | ,, | 5865 |
| 8 | ఆర్షకుటుంబము | వాసిరెడ్డి దుర్గాసదాశివప్రసాద్ | ,, | ,, | 3710 |
| 9 | ఒకానొక గ్రంథాలయ పుస్తకముల పట్టిక | — | ,, | ,, | 5384 |
| 10 | ఓల్డ్ప్రింటెడ్—అన్‌ప్రింటెడ్ బుక్స్ బయోగ్రఫీ | డా. నిడదవోలు వేంకటరావు | ,, | ,, | 5876 |
| 11 | కవులు—వాఙ్మయ చరిత్ర (క్రీ. శ. 1050—1600) | ,, | ,, | ,, | 5859 |
| 12 | కొమర్రాజు లక్ష్మణరావు జీవితము | ,, | ,, | ,, | 5851 |
| 13 | గాంధీ సాహిత్యము | ,, | ,, | ,, | 5850 |
| 14 | గోకర్ణ యాత్ర | — | ,, | ,, | 89/సి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 15 | గోవ్యాఘ్రి చరిత్రము | — | తాళపత్రం | సమగ్రం | 2813 |
| 16 | గోవ్యాఘ్రి చరిత్రము | — | ,, | అసమగ్రం | 5666 |
| 17 | గ్రంథపీఠికలు—తదితర సాహిత్య విషయములు | డా. నిడదవోలు వేంకటరావు | కాగితం | సమగ్రం | 5877 |
| 18 | జగన్నాథ మాహాత్మ్యము | — | తాళపత్రం | సమగ్రం | 3416 |
| 19 | చేకుమళ్ళ రాజగోపాలరావుగారి జీవిత చరిత్ర | చేకుమళ్ళ రాజగోపాలరావు | కాగితం | ,, | 2251 |
| 20 | చేకుమళ్ళవారి వంశవృక్షము—బిరుదు పత్రములు | ,, | ,, | ,, | 2255 |
| 21 | చేకుమళ్ళ రాజగోపాలరావుగారికి వ్రాయబడిన లేఖలు | ,, | ,, | ,, | 2256 |
| 22 | తులసీ మాహాత్మ్యము | కృష్ణమాచార్యులు | తాళపత్రం | ,, | 2816 |
| 23 | తెలుగుకవుల చరిత్ర (తిక్కన—ఎఱ్ఱనల యుగము మొదటి సంపుటము) | డా. నిడదవోలు వేంకటరావు | కాగితం | ,, | 5847 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 24 | తెలుగుకవుల చరిత్ర (తిక్కన—ఎఱ్ఱనల యుగము రెండవ సంపుటము) | డా. నిడదవోలు వేంకటరావు | కాగితం | సమగ్రం | 5848 |
| 25 | తెలుగుకవుల చరిత్ర (తిక్కనల—ఎఱ్ఱనల యుగము మూడవ సంపుటము) | ,, | ,, | ,, | 5849 |
| 26 | తెలుగులో శాస్త్ర వాఙ్మయము | ,, | ,, | ,, | 5853 |
| 27 | నవ్యాంధ్ర సాహిత్య చరిత్ర | ,, | ,, | ,, | 5864 |
| 28 | నీతి కథలు | — | తాళపత్రం | అసమగ్రం | 5667 |
| 29 | నీతి కథలు | — | కాగితం | ,, | 5822 |
| 30 | పంచతంత్ర కథలు | — | ,, | ,, | 5410 |
| 31 | పర్వత కల్పము | — | ,, | సమగ్రం | 3880 |
| 32 | పెండ్లిచేయించే క్రమము | — | తాళపత్రం | అసమగ్రం | 2818 |
| 33 | పోలేరమ్మ కథ | — | ,, | ,, | 2814 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 34 | ప్రితాపరుద్రుని చరిత్ర | ఏకామ్రనాథుడు | కాగితం | అసమగ్రం | 5383 |
| 35 | ప్రితాపరుద్రుని చరిత్ర | ,, | ,, | సమగ్రం | 5592 |
| 36 | ప్రాఙ్నన్నయయుగము (నన్నయకు పూర్వపువచన శాసనములు) | డా. నిడదవోలు వేంకటరావు | ,, | ,, | 5857 |
| 37. | బాల రామాయణము | — | కాగితం | సమగ్రం | 5290 |
| 38. | భట్టివిక్రమార్కుని కథలు | — | ,, | ,, | 5409 |
| 39. | భద్రాచల మాహాత్మ్యము | — | ,, | ,, | 5601 |
| 40. | భరత సావిత్రి | — | తాళపత్రం | ,, | 3288 |
| 41. | భరత సావిత్రి | — | ,, | ,, | 5611 |
| 42. | భారతయుద్ధకాల విమర్శనము | కొటికలపూడి నరిసింహకవి | కాగితం | ,, | 3684 |
| 43. | భారతము-కవిత్రయము | డా. నిడదవోలు వేంకటరావు | ,, | ,, | 5858 |
| 44. | భావనాఋషిఉపదేశము | — | తాళపత్రం | ,, | 739 |
| 45. | భాషా చరిత్ర | డా. నిడదవోలు వేంకటరావు | కాగితం | ,, | 5866 |
| 46. | మన్నారుగుడికైఫియత్తు | నిట్టల నాయన | ,, | ,, | 5408 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 47 | మార్కండేయ కథ | — | తాళపత్రం | అసమగ్రం | 2315 |
| 48. | రాకమచర్ల వేంకటదాసు చరిత్ర | కృష్ణయామాత్యుడు | కాగితం | సమగ్రం | 3853 |
| 49. | రేడియో ప్రసంగములు | డా. నిడదవోలు వేంకటరావు | ,, | ,, | 5855 |
| 50. | రేడియో ప్రసంగములు | ,, | ,, | ,, | 5856 |
| 51. | వచన రామాయణము | — | తాళపత్రం | అసమగ్రం | 5605 |
| 52. | వాఙ్మయ చరిత్ర–కవులు | డా. నిడదవోలు వేంకటరావు | కాగితం | సమగ్రం | 5863 |
| 53. | వెలంవారి పెళ్లి క్రమము | — | తాళపత్రం | ,, | 2817 |
| 54. | శ్రీకృష్ణదేవరాయల యుగము–నాయక రాజుల యుగము | డా. నిడదవోలు వేంకటరావు | కాగితం | ,, | 5862 |
| 55. | శ్రీనాథకవి–ప్రథమసంపుటము | ,, | ,, | ,, | 5860 |
| 56. | శ్రీనాథకవి–రెండవసంపుటము | ,, | ,, | ,, | 5861 |
| 57. | సత్యభామ లేఖ | కెళ్లకప్పయ్య కవి | కాగితం | సమగ్రం | 3306 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 58. | సాహిత్యవ్యాసములు (మొదటి సంపుటము) | డా. నిడదవోలు వేంకటరావు | కాగింత | సమగ్రం | 5867 |
| 59. | సాహిత్యవ్యాసములు (రెండవ సంపుటము) | ,, | ,, | ,, | 5868 |
| 60. | సాహిత్య విషయములు (మొదటి సంపుటము) | ,, | ,, | ,, | 5870 |
| 61. | సాహిత్య విషయములు (రెండవ సంపుటము) | ,, | ,, | ,, | 5871 |
| 62. | హరిణీస్తోత్ర్యము | బలరామదాసు | తాళపత్రం | ,, | 2815 |

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
# పరిశోధనాలయంలో భద్రపరచబడిన
# వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటలాగ్)

---

1. ఆక్సెషన్ నెంబర్ : 2816 కాల్ నెంబర్ : T 10—24
2. గ్రంథం పేరు తులసీమాహాత్మ్యము
3. కవిపేరు కృష్ణమాచార్యులు
4. విషయం వచన గ్రంథము
5. వ్యాఖ్యాత పేరు —
6. తాళపత్రప్రతి/కాగితం ప్రతి తాళపత్రప్రతి
7. అ) భాష, లిపి తెలుగు
   ఆ) ప్రతివ్రాసిన తేది —
8. ఆకుల/పుటల సంఖ్య 2
9. సమగ్రమా/అసమగ్రమా ? సమగ్రము
10. ప్రారంభం:

దేవా కృష్ణమాచార్యులు వూరగంటిలోను । వక బ్రాహ్మణుడు । కృష్ణమాచార్యులకు దండప్రణామంబుచేసి । స్వామి మా గృహంబు పావనంబాయెను । మేము కృతార్థుల మైతిమి । మాయింట ఆరగించి మమ్ము రక్షింపుమని విన్నపంబు చేసిన । కృష్ణమాచార్యులు యేమనుచున్నారు । జయనీవు సకల గుణ సంపన్నుడవు । యేకపత్నీవ్రతుడవు । అన్ని సరే । నీయింట బృందావనంబులేదు । బృందావనంబులేని యింట మేము ఆరగించేది లేదు । అనినానంతట। ఆ బ్రాహ్మణుండు తులశీ మాహాత్మ్యంబు ఎట్లాగనిన । ఆ బ్రాహ్మణునికి కృష్ణమాచార్యులు చెప్పందొణంగెను । నిశీసమయమందు తులశి

ధరియించిన వారికి గోహత్య, స్త్రీహత్య, శిశుహత్య బ్రహ్మహత్యాది పాతకంబులు । పరిహారమైపోవును । దేవా తులశీ బృందావనంబు ప్రదక్షిణంబు చేసినవారు । వేయి సంవత్సరంబులు అచ్చుత లోకాన నుండుదురు । తులశి కోట ప్రదక్షణ చేసిన వారు వెయ్యి సంవత్సరంబులు సత్యలోకంబుగాతురు । అశ్వమేధ ఫలంబు గలుగును ।

 

11. ముగింపు :

అంత్యకాలమందు తులశీ దళంబు యిచ్చినవార్కి తనదేహంబు పవిత్రంబై వైకుంఠంబుగాతురు । తులశిని నిత్యకృత్యంబున తీర్థంబుతో పుచ్చుకొని సంకీర్తన యెవరు విన్న సహస్రగోదానంబు చేసిన ఫలంబు గలుగును. యివిగాక పితృపితామహులతో గూడి విష్ణుపాదంబులు గాతురు. ఈ తులశీ మహాత్మ్యంబు అరుణోదయంబున, మధ్యాహ్నంబున సాయంకాలంబున పఠియించినవారు ఆయురారోగ్య అయిశ్వర్యాదులు అనుభవింతురని కృష్ణమాచార్యులు చెప్పందొణంగె। యీకథ విన్నవారు వ్రాశినవారికి శ్రీరాములు రక్షింతురు।

 

12. విశేషములు (రిమార్క్సు) :

వ్రాత స్పష్టము. ప్రతి చక్కనిది. ఇందు తులసీ మాహాత్మ్యము వర్ణింపబడినది.

## నీతిశాస్త్రము

| క్రమ సంఖ్య | వ్రాతప్రతి పేరు | కవి పేరు | తాళపత్రము లేదా కాగితము | సమగ్రము లేదా అసమగ్రము | క్రమానుగత గ్రంథసంఖ్య (అక్సెషన్ నెంబర్) |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. | నీతిశాస్త్రము | బద్దెన | కాగితం | సమగ్రం | 5413 |
| 2. | నీతిశాస్త్ర సముచ్చయము | — | ,, | సమగ్రం | 5578 |
| 3. | మనుస్మృతి సూచి | — | ,, | అసమగ్రం | 1830 |
| 4. | శూద్ర ధర్మోత్పల ద్యోతిని స్మృతికౌముది | శేషభట్టరు సింగరార్య కవి | తాళపత్రం | ,, | 541 |
| 5. | సకలనీతి సమ్మతము | మడికి సింగన | కాగితం | ,, | 5414 |

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
పరిశోధనాలయంలో భద్రపరచబడిన
వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటలాగ్)

---

1. అక్సెషన్ నెంబర్. 5414     కాల్ నెంబర్. T 11—2
2. గ్రంథం పేరు     సకలనీతి సమ్మతము
3. కవి పేరు     మడికి సింగన
4. విషయం     నీతి శాస్త్రము
5. వ్యాఖ్యాత పేరు     ........
6. తాళపత్రప్రతి/కాగితం ప్రతి     కాగితపు ప్రతి
7. అ) భాష, లిపి     తెలుగు
   ఆ) ప్రతివ్రాసిన తేది     —
8. ఆకుల/పుటల సంఖ్య     125
9. సమగ్రమా/అసమగ్రమా ?     సమగ్రము
10. ప్రారంభం :

ఉ. శ్రీమహిళా కటాక్ష తులసీదళ కౌస్తుభరత్నకాంతు లు
ద్దామగతి న్వెలుంగ విదితంబగు శక్రధనుస్సమేత మే
ఘామలి భాతి బొల్చు సుగుణాఢ్యుడు రామగిరీంద్ర కేశవ
స్వామి శ్రీ————ధ్రువంబుగ మత్కృతినాథు డయ్యెడున్.

వ. అని ఆశీర్వచనపూర్వకంబుగా నప్పరమేశ్వరు చరణారవిందం
బులు డెందంబున కుదురుపరచి నమస్కరించి.

క. సరసకవితా విలాసుఁడ
గురుభారద్వాజ రమ్యగోత్రాబ్ధి సుధా
కిరణాయ్యలార్య తనయుఁడ
హరిదాసుఁడ మడికిసింగయాఖ్యుఁడ ధాత్రిన్.

వ. సకల విద్వజ్జనానుగ్రహంబున నొక్క ప్రబంధంబు విరచింపం గోరి మనంబున నిట్లని వితర్కించితి.




వ. ఏను విన్నపంబుసేయంబూనిన సకలనీతి సమ్మత కథా ప్రారంభం బెట్టిదనిన—

సీ. ఆలోల కల్లోల మగు దుగ్ధనిధి ద్రచ్చి
దేవామృతము తేటదేర్చు పగిది
గంధకారుఁడు మున్నుగల వస్తువులు జోక
గూర్చి సుగంధంబు గూడినట్లు
అడవి పువ్వుల తేనెలన్నియు మధుపాళి
యిట్టలంబుగ జున్ను బెట్టుభంగి
తననేర్పు మెరసి వర్తకుఁడు ముత్తెము లీడు
గూర్చి హారంబు తా గ్రుచ్చుకరణి

తే.గీ కృతులు మునుజెప్పినట్టి సత్కృతులు ద్రవ్వి
కాంచు కంటెను నొకచోట గానబడగ
సకల నయశాస్త్ర మతములు సంగ్రహించి
గ్రంథ మొనరింతు లోకోపకారముగను.

గీ. అక్రమంబని తలపకు డఖిలములను
వర్గువులు చేసిచెప్పిన వరుసతోడ
జూచి సకలంబు తెలియుడు సుకవులార
చేరకుడు బొమ్మకై వంక చేదుగలదే.

క. కడివెడు దుగ్ధములోపల
దొడిబడ కొంణిదెండు సల్ల తోడంబడిన
ట్లెడనెడ నొక్కొక పద్యం
బడరించి మదీయకావ్యమని వ్రాయింతున్.

 

11. ముగింపు

గీ. జగతిలోపల వేదపారగులచేత
బ్రహ్మహత్యాది దుస్తరపాపములకు
తలచి చూడంగ నిష్కృతి గలుగుగాని,
వినుము నిష్కృతియును కృతఘ్నునికి లేదు.

క. విను మెవ్వడేని తను న
చ్చిన వానికి పిదప గీడుసేయునతడు న
చ్చిన యప్పు డతని మాంసము
గని కాకములైన రోయు గబళింపంగన్.

ఆ.వె యాన పాన భోజనాసన శయనంబు
లందు రంధ్ర మొక్కటైన తెలియ
గనినసైన జొచ్చి కడతేర్చురనదిగాన
వైరి వద్దివాని వలదునమ్మ.

నీతి తారావళి

క. ఖలుసంగతి గూడిన ని
ర్మల చిత్తుండైన జేయు బ్రతికూలుండై
యల నూనియ కర్పూరము
గలసిన విషమైన యట్లు కందామాత్య

క. పడి దునిమి పైవ దన కగ
పడు నంతకు శత్రునెడ గపట భక్తిదగున్
కడుగదె నదీప్రవాహము
పడి ద్రిప్పగ వలసి యంఘ్రిపము పాదంబుల్.

మదియ్యం

క. పంచేషు జనక రిపు గజ
పంచానన పాంచజన్య భాసితహస్తా
పంచానన నారీముఖ
సంచిత వాగ్విజిత పాద సరసిజయుగళా.

క. మురళీఘననాదామృత
తరళీకృత యోగిహృదయ తామరస మహా
త్మురళీ మల్ల విమర్దన
విరళీకృత జననమరణ విశ్వాతీతా.

మాలినీ. స్ఫురదురుతరభక్తి ర్భూరి విజ్ఞానమూర్తీ
గురుతరగుణశీలా గోపికాచిత్తలోలా
సరసిజదళనేత్రా సత్యభామాకళత్రా
విరళితభవపాశా విశ్వలోకప్రకాశా.

12. ఆశ్వాసాంతగద్య :

ఇది శ్రీనరసింహ వరప్రసాదలబ్ధ కవితావిచిత్ర భారద్వాజగోత్ర పవిత్ర అయ్యలామాత్యపుత్ర సరసగుణధుర్య సింగనార్య ప్రణీతం బైన సకలనీతి సమ్మతంబను రాజనీతి శాస్త్రంబందు రాజుల కవశ్య కర్తవ్యంబగు సంధి విగ్రహ యానాసనసమాశ్రయ ద్వైధీభావంబులను రాజషాడ్గుణ్యం బులును మంత్రిరక్షణ కార్యాకార్యవిధంబును, మిత్రామిత్ర వివేకంబు——— దండయాత్రావిధంబును, చతురంగ బలప్రకారంబును, ప్రయాణ ప్రయత్నం బును, తత్తచ్ఛకున నిశ్చయంబును, యుద్ధదాన వివరణంబును, నిజస్కంధ మూల ప్రకారంబును, ప్రత్యర్థి రాజబలాబల చింతనంబును, వుభయబల వ్యూహ రచిత చాతుర్యంబును, గవికోలు చాతురంగాయోధన నిశ్చయంబును, కార్యత్వరితక్రమంబును, అధికాధముల సమోధ్యా విధంబును, చోర నీతి ప్రకారంబును, అవిశ్వాస పరిశీలన ప్రకారంబు నన్నది తృతీయాశ్వాసము సంపూర్ణము.

13. విశేషములు (రిమార్క్సు) :

ప్రతి విలేఖనము : ప్లవ సం॥ర॥ ఆశ్వీజ బహుళ 4 గురువారం రెండుఝాముల వరకు సమాప్తము. సన్న 1311 ఫసలి తగిన రచ్చజన్న 1319 హిజరి ॥

కాగితపు ప్రతి. సమగ్రము. వ్రాతబాగున్నది. అలతిగా వ్రాత దోష ములు కలవు. ఇందు 3 ఆశ్వాసములు గలవు. వ్రాయసకాని పేరు లేదు.

○

# వ్రత కథలు

| క్రమ సంఖ్య | వ్రాతప్రతి పేరు | కవి పేరు | తాళపత్రము లేదా కాగితము | సమగ్రము లేదా అసమగ్రము | క్రమానుగత గ్రంథసంఖ్య (ఆక్సెషన్ నెంబర్) |
|---|---|---|---|---|---|
| 1 | ఆంధ్రవ్రత రాజము | కొల్లూరి కామశాస్త్రి | కాగితం | సమగ్రం | 1812 |
| 2 | కేదారగౌరివ్రతకథ—మంగళహారతి | — | తాళపత్రం | ,, | 4578 |
| 3 | కేదారేశ్వరవ్రతకథ | — | ,, | ,, | 5023 |

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
పరిశోధనాలయంలో భద్రపరచబడిన
ప్రాత ప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటలాగ్)

---

1. ఆక్సెషన్ నెంబర్ : 5023 — కాల్ నెంబర్. T 12–3
2. గ్రంథం పేరు — కేదారేశ్వర వ్రతకథ
3. కవి పేరు — ——
4. విషయం — వ్రత కథ
5. వ్యాఖ్యాత పేరు — ....
6. తాళపత్ర ప్రతి/కాగితం ప్రతి — తాళపత్ర ప్రతి
7. అ) భాష.లిపి — తెలుగు
   ఆ) ప్రతి వ్రాసిన తేది — ——
8. ఆకుల/పుటల సంఖ్య — 7
9. సమగ్రమా/అసమగ్రమా ? — సమగ్రము
10. ప్రారంభం :

శ్రీమత్కైలాస శిఖరంబున వజ్రంబులు వైడూర్యంబులు మాణిక్యంబులు మరకత తోరణంబులు నవరత్న స్థాపితమైన నగరియందు అనంత కోటి సూర్యప్రకాశ శోభితంబైనటి శ్రీపరమేశ్వరుండు సభ జెశి వలపట బ్రంహ్మ దాపట విష్ణు, ముందట వినాయకుండు కుమారస్వామి మొదలైన ప్రమథ గణాదులూను, దెవెంద్రాది దెవతలూ అష్టవసూలు, ఎకాదశ

రుద్రులు, ద్వాదశాదిత్యులూను, యక్ష గంధర్వ కిన్నర కింపురు షూలూన్ను, సప్త ఋషులు మొదలైన ఆ పరమేశ్వరునికి సాష్టాంగ దండప్రణామంబులు చేశి విన్నపంచాయ దొడంగిరి.

 

11 ముగింపు:

విక్రమార్కుండు విజయబాహుండు భాగ్యవతితోగూడి ఆ నోమునోమి సకలమైన ప్రజలకున్ను చెప్పేది. ఈకథనుడుంగులు దప్పినా నోము ఫలము తప్పబోదు. బ్రాహ్మణుండు నోమితె సకల శాస్త్రములకు కర్తలు, క్షత్రియుండు నోమితేను సకల రాజ్యము చెతురు, వైశ్యుండు నోమితె............... మితేను సకల సంపదలు, యె జాతివారు నోమినా సకల సంపదలు గలుగునూ యవ్వరు విన్నా యవ్వరు చదివినా యవ్వరు వ్రాశినా యవ్వరు నోమినా సకల సంపదలు గలిగి వర్ధిల్లుదురూ.

 

12 విశేషములు(రిమార్క్సు) :

ఇది కేదారేశ్వర వ్రతకథ యొక్క తాళపత్రప్రతి. ఇందుకథ సమగ్రముగాగలదు. కాని కవి నామ వివరాదులు లేవు .ప్రతి బాగుగనే యున్నది. కాని చివరి పత్రము పై భాగమున కొన్ని పదములు మాత్రము నష్టమైనవి. ప్రతివిలేఖన దోషములు గలవు.

 

# శతకములు

| క్రమ సంఖ్య | వ్రాతప్రతి పేరు | కవి పేరు | తాళపత్రము లేదా కాగితము | సమగ్రము లేదా అసమగ్రము | క్రమానుగత గ్రంథసంఖ్య (అక్సెషన్ నెంబర్) |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1 | అద్వైతబసవామృత శతకము | — | కాగితం | అసమగ్రం | 3851 |
| 2 | అన్నా శతకము | — | తాళపత్రం | ,, | 5661 |
| 3 | అశ్వత్థనారాయణ శతకము | — | ,, | ,, | 2319 |
| 4 | ఆంజనేయ నవపుష్పమాలిక | — | ,, | సమగ్రం | 2334 |
| 5 | ఈశ శతకము | దేవరకొండ గంగయ్య | కాగితం | ,, | 3895 |
| 6 | ఉమామహేశ్వర శతకము | విశ్వనాథ రామయ్య | తాళపత్రం | ,, | 5553 |
| 7 | కలువాయి శతకము | డబ్బీరు నరుసు | కాగితం | ,, | 5285 |

| | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 8 | కాళహస్తి శతకము | — | కాగితం | అసమగ్రం | 4026 |
| 9 | కాళహస్తి లింగ శతకము | — | ,, | ,, | 4027 |
| 10 | కాళహస్తి లింగ శతకము | విరూపాక్ష కవి | తాళపత్రం | సమగ్రం | 5554 |
| 11 | కాశీవిశ్వనాథ శతకము | అమలాపురం సన్యాసకవి | కాగితం | ,, | 5555 |
| 12 | కాళహస్తి సాంబశివ మహాప్రభూ శతకము | వీరశరభేంద్రకవి | తాళపత్రం | అసమగ్రం | 5621 |
| 13 | కృష్ణ శతకము | నృసింహ కవి | ,, | ,, | 591 |
| 14 | కృష్ణ శతకము | ,, | , | ,, | 792 |
| 15 | కృష్ణ శతకము | ,, | ,, | ,, | 1486 |
| 16 | కృష్ణ శతకము | ,, | ,, | ,, | 3192 |
| 17 | కేశవ శతకము | — | కాగితం | సమగ్రం | 1718 |
| 18 | గిరీశ శతకము | — | ,, | ,, | 4038 |
| 19 | గుట్టల నృసింహశతకము | — | తాళపత్రం | అసమగ్రం | 2333 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 20 | గౌరీ శతకము | — | కాగితం | అసమగ్రం | 3945 |
| 21 | చనిమిళ్ళ శివలింగ శతకము | — | తాళపత్రం | ,, | 3912 |
| 22 | చిత్కళాధామ శతకము | — | ,, | ,, | 778 |
| 23 | చిత్కళాధామ శతకము | — | ,, | ,, | 2293 |
| 24 | చిత్కళాధామ శతకము | — | ,, | ,, | 2311 |
| 25 | చిత్కళాధామ శతకము | — | కాగితం | సమగ్రం | 4031 |
| 26 | చిత్కళాధామ శతకము | — | ,, | ,, | 4040 |
| 27 | చిరశుభాకార శతకము | — | ,, | ,, | 4032 |
| 28 | చెన్నమల్లు సీసములు, మంగళహారతి, లాలిపాటలు | పాల్కురికి సోమనాథుడు | ,, | అసమగ్రం | 3922 |
| 29 | చెన్నమల్లు సీసములు | ,, | ,, | ,, | 4048 |
| 30 | చెన్నమల్లు సీసములు | ,, | తాళపత్రం | ,, | 5665 |
| 31 | చెన్నమల్లేశ శతకము | — | ,, | ,, | 5622 |
| 32 | జానకీపతి శతకము | — | ,, | ,, | 817 |
| 33 | జానకీపతి శతకము | — | కాగితం | ,, | 3876 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 34 | జానకీపతి శతకము | — | కాగితం | అసమగ్రం | 3954 |
| 35 | జానకీరామ శతకము | — | తాళపత్రం | ,, | 5662 |
| 36 | తంత్ర వినాయక శతకము | పెద్దన | ,, | సమగ్రం | 5879 |
| 37 | దాశరథీ శతకము | కంచెర్ల గోపన్న | ,, | అసమగ్రం | 445 |
| 38 | దాశరథీ శతకము | ,, | ,, | సమగ్రం | 1490 |
| 39 | దాశరథీ శతకము | ,, | ,, | అసమగ్రం | 1612 |
| 40 | దాశరథీ శతకము | ,, | ,, | ,, | 5660 |
| 41 | నందిలింగ శతకము | — | కాగితం | ,, | 3856 |
| 42 | నమఃశివాయ శతకము | చామర్తి సుందర శేషగిరిరాయకవి | ,, | సమగ్రం | 5557 |
| 43 | నవ్యతరభోగి శతకము | సదానంద రాజయోగి | ,, | ,, | 3857 |
| 44 | నారాయణ శతకము | — | తాళపత్రం | అసమగ్రం | 764 |
| 45 | నారాయణ శతకము | — | ,, | సమగ్రం | 2331 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 46 | నిరంజన శతకము | — | కాగితం | అసమగ్రం | 3938 |
| 47 | నీతి శతకము | — | తాళపత్రం | ,, | 604 |
| 48 | నీతి పద్యములు | — | కాగితం | సమగ్రం | 3310 |
| 49 | పరంధామ శతకము | — | ,, | అసమగ్రం | 3854 |
| 50 | పరమానంద శతకము | పరమానంద యతీంద్రుడు | తాళపత్రం | సమగ్రం | 2310 |
| 51 | పార్వతీ శతకము | — | కాగితం | అసమగ్రం | 3888 |
| 52 | ప్రసన్న రాఘవ శతకము | — | ,, | ,, | 4050 |
| 53 | బసవలింగ శతకము | — | తాళపత్రం | ,, | 771 |
| 54 | భాస్కర శతకము | భాస్కరకవి | ,, | ,, | 805 |
| 55 | భాస్కర శతకము | ,, | ,, | ,, | 2751 |
| 56 | భాస్కర శతకము | ,, | కాగితం | సమగ్రం | 4056 |
| 57 | భాస్కర శతకము | ,, | తాళపత్రం | అసమగ్రం | 5657 |
| 58 | భాస్కర శతకము | ,, | ,, | ,, | 5653 |
| 59 | భూపాళాలు— దశావతార భూపాళాలు | — | కాగితం | సమగ్రం | 3855 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 60 | పల్లార్యుల శతకము | — | కాగితం | సమగ్రం | 4891 |
| 61 | మానస శతకము | మైణిసి గంగయ | ,, | ,, | 4035 |
| 62 | మారుతీ శతకము | కొటికెలపూడి కోదండరామకవి | ,, | ,, | 5564 |
| 63 | యతిపతీ హనుమద్గిరిరాజ మందిర శతకము | — | తాళపత్రం | అసమగ్రం | 5022 |
| 64 | రమామనోహర శతకము | తటవర్తి వేంకటకవి | కాగితం | సమగ్రం | 5560 |
| 65 | రాఘవ శతకము | మేనూరి శ్రీముఖకవి | ,, | ,, | 5562 |
| 66 | రామతారక శతకము | — | తాళపత్రం | అసమగ్రం | 791 |
| 67 | రామతారక శతకము | — | ,, | ,, | 3669 |
| 68 | రామతారక శతకము | — | కాగితం | సమగ్రం | 3877 |
| 69 | రామతారక శతకము | — | ,, | అసమగ్రం | 3924 |
| 70 | రామతారక శతకము | — | ,, | ,, | 5819 |
| 71 | రామభద్ర శతకము | కుప్పిలి రామయ్య కృష్ణుడు | తాళపత్రం | ,, | 5659 |
| 72 | రామరాజవతంస శతకము | కొటికెలపూడి కోదండరామకవి | కాగితం | సమగ్రం | 5565 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 73 | రామలింగేశ్వర శతకము | — | తాళపత్రం | అసమగ్రం | 3667 |
| 74 | రామ శతకము | — | ,, | సమగ్రం | 5664 |
| 75 | వజ్రగిరి నరసింహ శతకము | రంగధామ కవి | ,, | అసమగ్రం | 2320 |
| 76 | వీరహనుమంత శతకము | — | ,, | ,, | 2858 |
| 77 | వృషాధిప శతకము | పాల్కురికి సోమనాథుడు | కాగితం | సమగ్రం | 4043 |
| 78 | వేంకటేశ శతకము | మంచెళ్ల కృష్ణకవి | తాళపత్రం | ,, | 3363 |
| 79 | వేంకటేశ్వర శతకము | — | ,, | అసమగ్రం | 3564 |
| 80 | వేణుగోపాల శతకము | — | కాగితం | ,, | 3921 |
| 81 | వేమన శతకము | వేమన | తాళపత్రం | ,, | 843 |
| 82 | వేమన శతకము | ,, | ,, | ,, | 1497 |
| 83 | వేమన శతకము | ,, | ,, | ,, | 2291 |
| 84 | వేమన శతకము | ,, | కాగితం | ,, | 3840 |
| 85 | వేమన శతకము | ,, | ,, | సమగ్రం | 3866 |
| 86 | వైరాగ్య శతకము | — | తాళపత్రం | అసమగ్రం | 4677 |
| 87 | శంభు శతకము | — | కాగితం | ,, | 3923 |
| 88 | శార్దూల శతకము | రంగ కవి | ,, | సమగ్రం | 5563 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 89 | శిరుసనగుండ్ల రామ శతకము | — | కాగితం | అసమగ్రం | 3926 |
| 90 | శివకామసుందరి శతకము | — | తాళపత్రం | ,, | 5881 |
| 91 | శివశంకర శతకము | పెద్దన | ,, | సమగ్రం | 5883 |
| 92 | శివ శతకము — శివరత్న కందమాల | — | కాగితం | ,, | 3852 |
| 93 | శివ శతకము | — | ,, | అసమగ్రం | 4052 |
| 94 | శృంగార శతకము | — | ,, | ,, | 5559 |
| 95 | శృంగార సీస శతకము | — | తాళపత్రం | ,, | 5615 |
| 96 | శ్రీధనంజయ మహారాజ శతకము | పంతుల బ్రహ్మదేవకవి | కాగితం | సమగ్రం | 5573 |
| 97 | శ్రీమత్పంచముఖేశలింగ స్తుత్యంచిత సీస పద్య ద్వాత్రింశతి | అమలాపురం సన్యాసకవి | ,, | ,, | 5556 |
| 98 | శ్రీరామ శతకము | — | తాళపత్రం | అసమగ్రం | 3487 |
| 99 | శ్రీరామప్రభో శతకము | కామేశ్వరకవి | కాగితం | సమగ్రం | 5577 |
| 100 | శ్రీశైల నందిలింగ శతకము | ఉమాపతి | ,, | అసమగ్రం | 3925 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 101 | శ్రీశైల మల్లిఖార్జున శతకము | — | కాగితం | అసమగ్రం | 3952 |
| 102 | శ్రీశైల పల్లిఖార్జున శతకము | — | తాళపత్రం | ,, | 4668 |
| 103 | సత్యహరీ శతకము | చెళ్ళపిళ్ళ రామకవి | కాగితం | సమగ్రం | 5566 |
| 104 | సదానందయోగి శతకము | సదానందరాజయోగి | తాళపత్రం | అసమగ్రం | 5663 |
| 105 | సర్వేశ్వర శతకము | యథావాక్కుల అన్నమయ్య | కాగితం | ,, | 3943 |
| 106 | సాంబశివమహా ప్రభూ శతకము | వీరభద్రి కవీంద్రుడు | ,, | సమగ్రం | 3837 |
| 107 | సీతారామ శతకము | — | తాళపత్రం | అసమగ్రం | 4567 |
| 108 | సుబ్బరాయ శతకము | వేంకట కవి | ,, | సమగ్రం | 573 |
| 109 | సుభాషిత రత్నావళి | ఏనుగు లక్ష్మణకవి | కాగితం | సమగ్రం | 1899 |
| 110 | సుభాషిత రత్నావళి | ,, | తాళపత్రం | సమగ్రం | 3293 |
| 111 | సుభాషిత రత్నావళి | ,, | ,, | అసమగ్రం | 3666 |
| 112 | సుమతీ శతకము | — | ,, | ,, | 781 |
| 113 | సుమతీ శతకము | — | ,, | అసమగ్రం | 807 |
| 114 | సుమతీ శతకము | — | ,, | ,, | 846 |
| 115 | సుమతీ శతకము | — | ,, | ,, | 3404 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 116 | సుమతీ శతకము | — | తాళపత్రం | అసమగ్రం | 5641 |
| 117 | సోమలింగేశ్వర శతకము | ఏరామప్రియోగి | ,, | ,, | 3426 |

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం

## పరిశోధనాలయంలో భద్రపరచబడిన

## వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటలాగ్)

---

| | |
|---|---|
| 1. ఆక్సెషన్ నెంబర్: 781 | కాల్ నెంబర్. T 13-42 |
| 2. గ్రంథం పేరు | సుమతీ శతకము |
| 3. కవి పేరు | ——— |
| 4. విషయం | శతకము |
| 5. వ్యాఖ్యాత పేరు | ——— |
| 6. తాళపత్రప్రతి/కాగితం ప్రతి | తాళపత్ర ప్రతి |
| 7. అ) భాష, లిపి | తెలుగు |
| ఆ) ప్రతివ్రాసిన తేది | ——— |
| 8. ఆకుల/పుటల సంఖ్య | 6 |
| 9. సమగ్రమా/అసమగ్రమా ? | సమగ్రము |

10. ప్రారంభం :

కం. శ్రీరాముని --- చేతను
నారూఢిగ సకల జనులు నౌరాయనగా
ధారాళమయిన్న నీతులు
నోరూరగ జవులు పుట్ట నుడివెద సుమతీ.

కం. అక్కరకు రాని చుట్టము
మ్రొక్కిన వరమీని వేల్పు మో ----- మున దా
నెక్కిన బారని గుఱ్ఱము
గ్రక్కున వి----- వంగ వలయు గదరా సుమతీ.

కం. అడిగిన జీతం బివ్వని
మిడిమేలపు దొరను గొల్చి మిడుకుట కంటే
వడిగల యెద్దుల గట్టుక
మడి దున్నుక బ్రదుకవచ్చు మహిలో సుమతీ.

కం. అడియా---- కొలువు గొలువకు
గుడి మణియము నేయబోకు కుజనులతోడన్
విడువక కూరిమి సేయకు
అడవిని దోడరయ కొంటి నరుగకు సుమతీ.

కం. అధరము గదలీ గదలక
మధురము------భాషలుడిగి మౌనవ్రతుడౌ
నధికార రోగపూరిత
బధిరాంధక వశముజూడ బాపము సుమతీ.

కం. అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడతెగక పారు నేరును ద్విజుడుం
జొప్పడిన యూర నుండుము
జొప్పడ కున్నట్టి యూరు చొరకుమి సుమతీ.

కం. అప్పుగొని సేయు విభవము
ముప్పున ప్రాయంపుటాలు మూర్ఖుని దపముం
దప్పరయని నృపురాజ్యము
చెప్పరమై మీద గీడు చెప్పుర సుమతీ.

 

11. ముగింపు :

కం. ఆకొన్న కూడె యమృ——————
—————— ——————— డె దాత ధరిత్రిన్
సోకోర్చువాడె మనుజుడు
తేకువ కలవాడె వంశతిలకుడు సుమతీ.

కం. మది నొకని వలచి యుండగ
మదిచెడి—————— క్రూరవిటుడు మానక తిరుగున్
యి——————————
—————————— యా పంజరమున జగతిని సుమతీ.

కం. తనవారు లేని చోటను
జను లించుకలేని చోట జగడము చోట
న్ననుమాన మైనచోటను
మనుజునకును నిలువదగదు మహిలో సుమతీ.

కం. పుత్రోత్సాహ
——————— నపుడె పుట్టదు జనులా
పుత్రుని గనుగొని పొగడగ
బుత్రోత్సాహంబు పొడమి పొదవును సుమతీ.

కం. వేసరపు జాతి యైనన్
వీసంబును జేరనట్టి వెర్రియునైనన్
దాసి కొడుకైన మిక్కిలి
---------- ------- రాజు గదరా సుమతీ.

కం. తనకలిమి యింద్ర భోగము
తన దుఃఖమె సర్వలోక దారిద్రంబుం
దన చావు జలప్రళయము
తన వలచిన యదియె రంభ తథ్యము సుమతీ.

 

12. విశేషములు (రిమార్క్స్):

ప్రతి విలేఖనము : మందడి పాపయ్య కుమారుడు స్వహస్తం వ్రాసుకున్న సుమతీ శతకము.

ఈప్రతి యందు సుమతీ శతకము పూర్తిగా నున్నది. ఇది సమగ్ర ప్రతి. ఇందు ప్రతి విలేఖనమున స్వల్ప దోషములు గలవు. ఈప్రతి కొంత క్రిమిదష్టమై యున్నది. చివరి పత్రముయొక్క పార్శ్వభాగము కొంత శిథిల మైనది. లిపి సుస్పష్టము.

స్త్రీ బాల వృద్ధులు ఆబాలగోపాలము ప్రాథమిక దశనుండియే నేర్చుకొను శతకమే యిది. ఇందు జీవితముయొక్క నగ్నసత్యములు, నీతిమార్గములు, ఉపదేశాదులు నిత్యజీవన సహాయకములు అగు పద్యములే యున్నవి, ఇందు 108 పద్యములు 'సుమతీ' మకుటశోభితములై యున్నవి.

# గణితశాస్త్రము

| క్రమ సంఖ్య | వ్రాతప్రతి పేరు | కవి పేరు | తాళపత్రము లేదా కాగితము | సమగ్రము లేదా అసమగ్రము | క్రమానుగత గ్రంథసంఖ్య (ఆక్సెషన్ నెంబర్) |
| --- | --- | --- | --- | --- | --- |
| 1 | | 2 | 3 | 4 | 5 |
| 1 | క్షేత్ర గణితము | — | తాళపత్రం | అసమగ్రం | 3675 |
| 2 | గణిత శాస్త్రము | — | ,, | ,, | 1216 |
| 3 | గణిత శాస్త్రము | పాపులూరి మల్లన | ,, | సమగ్రం | 2752 |
| 4 | గణిత శాస్త్రము | ,, | కాగితం | ,, | 3875 |
| 5 | గణిత శాస్త్రము | ,, | ,, | అసమగ్రం | 3905 |
| 6 | గణిత శాస్త్రము | — | తాళపత్రం | ,, | 4687 |
| 7 | లీలావతి గణితము | — | ,, | ,, | 3356 |

| | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 8 | సారసంగ్రహ గణితశాస్త్రము | మహావీరాచార్యులు | తాళపత్రం | అసమగ్రం | 1215 |
| 9 | సారసంగ్రహ గణితశాస్త్రము | పావులూరి మల్లన | ,, | సమగ్రం | 2811 |
| 10 | సూత్ర గణితము | —— | ,, | ,, | 418 |
| 11 | సూత్ర గణితము | పావులూరి మల్లన | ,, | అసమగ్రం | 2812 |



# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
## పరిశోధనాలయంలో భద్రపరచబడిన
## వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటలాగ్)

---

1. ఆక్సెషన్ నెంబర్. 2811 — కాల్ నెంబర్. T. 14-1
2. గ్రంథం పేరు — సారసంగ్రహ గణితశాస్త్రము
3. కవి పేరు — పావులూరి మల్లన
4. విషయం — గణితశాస్త్రము
5. వ్యాఖ్యాత పేరు — ——
6. తాళపత్ర ప్రతి/కాగితం ప్రతి — తాళపత్ర ప్రతి
7. అ) భాష, లిపి — తెలుగు
   ఆ) ప్రతి వ్రాసిన తేది — విక్రమనామ సం॥ భాద్రపద శు 9 ఆదివారం పగలు ఝామువరకు
8. ఆకుల/పుటల సంఖ్య — 43
9. సమగ్రమా/అసమగ్రమా? — సమగ్రము

10 ప్రారంభం:

గ — ౧
అర గరిశలు — ౨
దశాలు — ౩
పావు గరిశలు — ౪
ఆరు పుట్లు — ౫
అయిదు పుట్లు — ౬

అరగరిశలు — 2
దశాలు — 3

మూడు పుట్లు పదిహేను కుంబాలు — ౮
మూడు పుట్లు — ౧౦
రెండుపుట్ల పందుములు — ౧౨
పుట్టీ యెదుములు — ౨౪
పుట్టీ నతలుములూ — ౨౫
పుట్లు — ౩౦
పదిహేమ కుంబాలు — ౪౦
పంనెండు కుంబాల రెండుమానికలూ — ౪౮
పంనెండు కుంబాలు —౫౦
పందుములూ — ౬౦
ఎనిమిది కుంబాలూ — ౭౫

 

శా. శ్రీకంఠం సుగుణం సమస్త జగదా కర్తార మీశన్ గురుం
భూతోయానల చంద్రసూర్యపవన వ్యోమాష్టి మూర్తినీవిభునీ
నిత్యానంద మయోపయోగిరిజయో సార్థ ప్రజావృద్ధియో
మాయాయోగపుపైతితినీ శుభకరం వందే శివం వ్రాయశే.

ఇట్లు సకల జనంతర్యామి యెగు శివునికి నమస్కరించిద తదనంతరంబ్బా.

 

ఆ. వె. సౌజ్ఞ లెరుగ కుంన్న సంఖ్యాన మెరుగంగ
నేరరాదు గాన నిర్ణయముగ
భూమి కాల ధాన్య హేమ తులాదుల
మాన మెరుగ వలయు మహిమతోడ.

 

11. ముగింపు :

ఇందుకు టీకా—

అర్థమనగా సంకలిత ధనం ఒడ్డువుంచి, అష్టమనగా సూత్రం, యెనిమిది చాత గుణించి ఆ ఒడ్డుకు మళ్ళీ వుత్తర చాత గుణించి, వకచోట ఒడ్డువుంచ్చేది. అది యంతో సూత్రం రెండుచాత గుణించగా, అయ్ని ఒడ్డులో ఉత్తరంతో కొట్టి వేయ్యగా, వుంన ఒడ్డు మునువు వుంచిన ఒడ్డులో, కల్పి అందుకు వర్గమూల తెచ్చి దిగిన లబ్దంలో వుత్తరయం తోల్పి కునీది. తర్వాత ఒడ్డు వకం శాయవలెనూ. వుంన ఒడ్డులో అదియంతో తీశివెయ్యవలెనూ. తర్వాత వుంన ఒడ్డుకు వుత్తర యంతో దానిచేత హరిస్తే దిగువబడ్డ ఒడ్డు గచ్ఛ అని గ్రహించేది. ఇది గచ్ఛాయనసూత్రం సంపూర్ణం

 

12. విశేషములు (రిమార్క్సు) :

ఇది పావులూరి మల్లన యొక్క గణితపు ప్రతి. దీనిని మారోజు సోమన్న వ్రాసుకొనెను. ఇందు ఆద్యంతప్రతి కలదు. కావున ఇది సమగ్ర ప్రతి. ఇందు సంజ్ఞ, గుణక, భాగా హారాది సప్తవర్గులు గలవు. లేఖన దోషములు చాలగలవు, ప్రతి బాగున్నది. లిపి స్పష్టము.

**

# నిఘంటువులు

| క్రమ సంఖ్య | వ్రాతప్రతి పేరు | కవి పేరు | తాళపత్రము లేదా కాగితము | సమగ్రము లేదా అసమగ్రము | క్రమానుగత గ్రంథసంఖ్య (ఆక్సేషన్ నెంబర్) |
| --- | --- | --- | --- | --- | --- |
| | 2 | 3 | 4 | 5 | 6 |
| 1 | ఆంధ్రనామ సంగ్రహము | పైడిపాటి లక్ష్మణకవి | తాళపత్రం | అసమగ్రం | 1493 |
| 2 | ఆంధ్రనామ సంగ్రహము | ,, | ,, | ,, | 1508 |
| 3 | ఆంధ్రనామ సంగ్రహము | ,, | ,, | ,, | 2810 |
| 4 | ఆంధ్రనామ సంగ్రహము | ,, | ,, | సమగ్రం | 3819 |
| 5 | ఆంధ్రనామ సంగ్రహము | ,, | ,, | అసమగ్రం | 4679 |
| 6 | ఆంధ్రనామ సంగ్రహము | ,, | ,, | ,, | 4580 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 7 | ఆంధ్రనామ సంగ్రహము— | అడిదము సూరకవి | తాళపత్రం | అసమగ్రం | 3673 |
| | ఆంధ్ర శేషము | | ,, | సమగ్రం | 2329 |
| 8 | ఆంధ్రభాషార్ణవము | శ్రీకరకోటి వెంకనార్యుడు | ,, | అసమగ్రం | 2753 |
| 9 | ఆంధ్రభాషార్ణవము | .. | కాగితం | ,, | 1913 |
| 10 | ఉర్దూ—తెలుగు నిఘంటువు | — | తాళపత్రం | సమగ్రం | 5618 |
| 11 | దేశీపద నిఘంటువు | — | | | |



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
పరిశోధనాలయంలో భద్రపరచబడిన
వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటలాగ్)

---

| | | |
|---|---|---|
| 1. | ఆక్సెషన్ నెంబర్ : 5618 | కాల్ నెంబర్ T. 15—11 |
| 2. | గ్రంథం పేరు | దేశిపద నిఘంటువు |
| 3. | కవి పేరు | — |
| 4. | విషయం | నిఘంటువు |
| 5. | వ్యాఖ్యాత పేరు | — |
| 6. | తాళపత్రప్రతి/కాగితం ప్రతి | తాళపత్ర ప్రతి |
| 7. | అ) భాష/లిపి | తెలుగు |
| | ఆ) ప్రతివ్రాసిన తేది | — |
| 8. | ఆకుల సంఖ్య/పుటల సంఖ్య | 16 |
| 9. | సమగ్రమా/అసమగ్రమా ? | సమగ్రము |

10. ప్రారంభం :

అరిది—అబ్బురము అలమి—పుంచి అంగించి—పొగడి అట్టిద—అటువంటిప అసలు—బురద అలవు—బలిమి అచ్చికము—కొదవ అంకి—దుక్కి అడలు — అంగదవ్యథ అన్న—స్త్రీ అరచె—కూసె అరిమురి—ముందువెనక అట్టీడ-అటువంటివాడ అయిద—వెంబడి అచ్చోటు—ఆతావు అలసిశలశము — అడ్డసాళ్ళ—పాచికలు అగ్గలము—అధికము అగ్గెడ-అప్పసము అగ్గము—కైవశమునకు యీ 2 పేళ్ళు । అత్తమిల్లి—పరుండి

యీ 2 పవ్వళించి అనుటకు పేళ్ళు । అవుడుకరచి-కోపాన పెదవి కరచి అంటి—ముట్టి అరిగి—నశించి - అరవలు—చిదుపలు—అఎలువడ—నగముగాగాను—అరువుళ్ళు—పౌళ్ళు అలవుగ -చులుకనగ అలవోక — పొద్దుపోక అరసి — విచారించి - అరవాయి వెలితి అటుజాతి దుష్టజాతి-అరకలు—కొండి । అల్లోనేరే—నమస్కారం—అల్లిబిల్లి—పెనుకవ । అరికట్లు-యీపలావల జననిది-పువ్వాటుగా—దుప్పటములుగా — అల్లితెమ్మెర-చల్లగాలి। అయిదు పదిశాయక—ముందరి అడుగు వెనకబెట్టక । అరిబోశి—అ——నడుమకూర్చి - అదువ-అద్దె । అడరున — సందుకట్టున అట్టీడెను-సంచరించెను । అకరులు — కేసరములు । అరిశలు — అతరిసముల భేదములు । అదటు-దురుసు । అర్మిలి—కూర్మి । అడియాలం-గురుతు । అగబడె-పట్టుబడె । అనుపు — లెస్స । అనిచి—అట్టి అక్కు - రొమ్ము । అ్రరు-కుతికె । అదటు - వుదుటు । అత్తము - గుంపు । అనుడు — అనువుడు । అలతి - తోడెము ।

 

11. ముగింపు :

సుబ్బె । పుట్టి । సుమ్మిను । అనుమీ । సురిగె । సొరిగె। సుండీ—అసుండి । సూడిద । కానుక । సూరెల । పార్శ్వముల। సూడిగములు । పై ముద్దెలుగల కడియములు । సొబగు । చూలు । సొగసున్ను । సొద । చిచ్చు । సొగసి । నురువయ్యె । పాడెనున్ను । సొరిడి । వరుస । సొమ్ములపోయె । సొమ్మసిల్లె । సొల్లెము । నెమలిరెక్కలు జుట్టినపాగ । సోలెడు । తవ్వెడు। సోలె। డస్సి । సొబ్బె । శిబ్యము । సెసకొప్పు । పెండ్లికొప్పు । సెగి । నలుకువ । సైదము । గోధుమ పిండి । హరికోలు । చిన్నపుట్టి। హరివాణము । పళ్యెరము । హజారం । అజారము । నగరివెల

బావడి । హహావలి । దుప్పటి । హసదు । దొడ్డవాడు । హదన, అదనున । సమయాన। హజురుజు । సముఖము । హేసు । క్రొత్త హొంతకారి । సొగసుగత్తె । సామించెజిట్టిన్ని । హెరావలి, హొడవన్నెకోక । హొరంగు । సొగసు । హేమా హేమీలు, ఘనులు । హచ్చరిల్లె । అభివృద్ధి బొందె । హ్మాసరె । శాభాసు । హోరాహోరి । యెడతెగక-అతిబు । ఆహారము । అవణము । చొక్కము । ఉబ్బలు - దబ్బరలు । బొప్పె అరచె । బొంపె । లేదూరు । లేరాపు । ఉచ్చబడి । విస్మయమంది । ఉంగులువారకట్టి । చుంగులు వారకట్టి । రెశి । శమ్మి ।

12. విశేషములు (రిమార్క్సు):

సమగ్రము. తాటియాకు ప్రతి. అలతిగా క్రిమి దష్టము. వ్రాత చక్కనిది. వ్రాత దోషములు కలవు. ప్రతివ్రాసినకాలము గాని, వ్రాయసకాని పేరుగాని పేర్కొనబడలేదు.

ఇందు దేశిపదములకు అర్థములు వ్రాయబడినవి. ఇది విఘంటువు. వ్రాసిన వాని పేరు కనబడలేదు.



# దండకములు

| క్రమ సంఖ్య | వ్రాతప్రతి పేరు | కవి పేరు | తాళపత్రము లేదా కాగితము | సమగ్రము లేదా అసమగ్రము | క్రమానుగత గ్రంథసంఖ్య (ఆక్సెషన్ నెంబర్) |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1 | అమ్మవారి దండకము (భద్రకాళి దండకము) | — | తాళపత్రం | సమగ్రం | 5628 |
| 2 | ఆంజనేయ దండకము | — | ,, | అసమగ్రం | 779 |
| 3 | కొల్లాపురమ్మ దండకము | శ్రీరామకవి | కాగితం | సమగ్రం | 52 6 |
| 4 | భల్లాణ దండకము | రామయోగి | ,, | ,, | 37 |
| 5 | యువరాజ దండకము | ... | తాళపత్రం | అసమగ్రం | 248 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 6 | రాధామనోనంద గోపాల కృష్ణ దండకము | నారప్ప | తాళపత్రం | సమగ్రం | 3414 |
| 7 | విష్ణ్వశ్వం దండకము | నారాయణ కవి | కాగితం | ,, | 3844 |
| 8 | శివ దండకము | — | తాళపత్రం | ,, | 3418 |
| 9 | శ్రీకృష్ణ దండకము | — | ,, | ,, | 3289 |
| 10 | శ్రీరంగ దండకము | ఉయ్యాలవాడ నారాయణకవి | ,, | అసమగ్రం | 2312 |
| 11 | శ్రీరామ దండకము | — | ,, | ,, | 3671 |
| 12 | సద్గురుస్వామిదండము | — | కాగితం | సమగ్రం | 5284 |

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
## పరిశోధనాలయంలో భద్రపరచబడిన
## వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటలాగ్)

---

| | |
|---|---|
| 1. ఆక్సేషన్ నెంబర్ : 2312 | కాల్ నెంబర్. T 16—3 |
| 2. గ్రంథం పేరు | శ్రీరంగ దండకము |
| 3. కవిపేరు | ఉయ్యాలవాడ నారాయణకవి |
| 4. విషయం | దండకము |
| 5. వ్యాఖ్యాత పేరు | — |
| 6. తాళపత్రప్రతి/కాగితంప్రతి | తాళపత్ర ప్రతి |
| 7. అ) భాష, లిపి | తెలుగు |
| ఆ) ప్రతివ్రాసిన తేది | — |
| 8. ఆకుల/పుటల సంఖ్య | 22 |
| 9. సమగ్రమా/అసమగ్రమా ? | అసమగ్రము |

10. ప్రారంభం :

శ్రీమద్రమారామ వక్షోజ కుంభ ద్వయీ లిప్త కస్తూరికా కుంకుమ ప్రోల్ల సద్భద్ర పక్షుండు, పంకేరుహాక్షుండు గోపాంగ్గనా.........ర్ణ చంద్రుండు కారుణ్య సాంద్రుండు కావేరికాతీర వాసుండు, కాట్యంగ జోద్యద్విలాసుండు, శ్రీరంగ్గ.........క్త కైవల్య సంధాయకుం డక్షరుం డాద్యు డంభోజ గర్భాండ భాండోదరుం డార్యసంరక్షకుం డవ్యయు.................. జేయుం డగణ్యుం డసాధ్యుం డనంతావతారుం డజుం డాది

మధ్యాంత్త సంశూన్య దష్టాక్షరి........పు శ్రీరంగ్గధామేశ్వ రుండు నాడెక్కుడైనట్టి సంత్తోషముం బిక్కటిల్లంగ్గ బల్ం మక్కువన్ నిటు చెతెలు పంన్నిటి చె మ.........నం.........గా, మంచిగంధంబు మెనిండ్డగా బూశి శిస్తుఁ చలంగంగ్గ కస్తూరి నామంబ్బు షా........దిద్ది డం.........కుండలంబ్బుల్ వినోదం బుగా కర్ణయుగ్మం........

 

11. ముగింపు :

.........సౌందర్య సౌశీల హె.....వ.....ధన్యయై యొప్పు లీలావతీ కన్యకన్ హంసతూలీ సుతల్పంభునన్ జెర్చి చాశీతి బంధంబ్బులన్ం. కోకిల క్రౌంచ కేకీ స్ఫురత్కార పారవ..... నముల్.....నులన్ం.........గెలి దంత క్షతాలీ.........నోత్త్రాడ నోత్పెడ నోద్యద్రహస్యంబ్బులన్ం,.........ల్కవన్ం గుల్కు చున్ం, బాల లాలించ్చి సంతోష వారాశిలో నోలలాడించ్చి రక్షించ్చె నం—న్ం చతుర్బాహు పేరన్, శతానంద్ద బృందారక స్తోమ సంరక్షణోత్సాహు పేరన్, జగాధీశ గంధర్వ పేరన్, రమాద్య క్షరా.........వికా పావకాకార సమ్యక్ప్రభావర్య పేర న్ం, తతానేక కోట్యబ్జ జాండేశుడై యొప్పు శ్రీరంగ్గ ధామేశు పేరన్. గరంబొప్ప కంద్దాళ శ్రీదొడ్డయాచార్య పాదాంబ్బు జెంద్దింద్దిరు-డైన, యుయ్యాల వాడాన్వయాంభోధి చెంద్రుండ్డ శ్రీపెద్దనామాత్య పుత్రుండ్డ, నారాయణుం డంద్రగీర్వాణ భాషా మహద్గ్రంధ పారాయణుం డున్నతిన్ం గూర్చి యొప్పించె నీ దండకం.....ంద్దు మార్తాండ నక్షత్ర పర్యంతమున్ భూమి రాణింపగా నింపునన్ సొంపునన్.

 

విశేషములు (రిమార్క్స్) :

ఈ శ్రీరంగ దండకము ఉయ్యాలవాడ నారాయణకవి విరచితము. శ్రీరంగేశుని స్తోత్రమే యిందలి యంశము. ఈ ప్రతి బహు క్రిమిదష్టమై చాల శిథిలావస్థలో నున్నది. మధ్య రెండు పత్రములు పోయినవి. మొదటి రెండు పత్రములు కొంత భాగము నష్టమైనవి. ఇది ఆద్యంతములు ఉన్నను అసమగ్ర ప్రతియే. ప్రతి విలేఖన దోషములు చాల కలవు.



# మత-వేదాంతగ్రంథములు

| 1 | 2 | 3 | 4 | 5 | | 6 |
|---|---|---|---|---|---|---|
| 1 | అనుభవసారము | పాల్కురికి సోమనాథుడు | | కాగితం | సమగ్రం | 74 |
| 2 | అనుభవసారము | ,, | | ,, | ,, | 79 |
| 3 | అపరోక్ష విభూతి | కామరాజు | | తాళపత్రం | ,, | 2227 |
| 4 | అష్టావక్రగీత | — | | ,, | అసమగ్రం | 5677 |
| 5 | ఆత్మబోధన ప్రకారము | — | | కాగితం | సమగ్రం | 3874 |
| 6 | ఆత్మైకబోద | యోగానంద అవదూతస్వామి | | తాళపత్రం | ,, | 5678 |
| 7 | గురుశిష్య సంవాదము | ,, | | ,, | ,, | 2295 |
| 8 | గురుశిష్య సంవాదబోధ | ,, | | కాగితం | ,, | 3930 |
| 9 | గురుశిష్య సంవాదము | | | తాళపత్రం | సమగ్రం | 5351 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 12 | ఘనవీరశైవ దీక్షాబోధ | పిడుపర్తి బసవన్న | కాగితం | అసమగ్రం | 4060 |
| 13 | చతుర్వేద సారము | పాల్కుర్కి సోమనాథుడు | ,, | సమగ్రం | 102 |
| 14 | చతుర్వేద సారము | ,, | ,, | అసమగ్రం | 4041 |
| 15 | జీవ ప్రబోధము | జనార్ధనబ్రహ్మ | తాళపత్రం | ,, | 3829 |
| 16 | జీవైక్య బోధ | — | కాగితం | సమగ్రం | 13 /సి |
| 17 | దీక్షాబోధ | పిడుపర్తి బసవన్న | తాళపత్రం | ,, | 4002 |
| 18 | నవపద్యపుష్పమాలిక—వేదాంత సూత్రములు | సిద్ధయోగి | కాగితం | ,, | 3847 |
| 19 | నిగమాంతార్థ ప్రదీపిక | ధుక్మయామాత్యుడు | ,, | అసమగ్రం | 3910 |
| 20 | పంచభూతాల నిర్ణయము | — | తాళపత్రం | ,, | 824 |
| 21 | పంచరత్నములు | సిద్ధయోగి | కాగితం | సమగ్రం | 3845 |
| 22 | పంచీకరణము | — | ,, | ,, | 135/డి |
| 23 | పంచీకరణము—పిండోత్పత్తి | చెన్నబసవేశ్వరుడు | తాళపత్రం | ,, | 787 |
| 24 | పరబ్రహ్మ లక్షణ నిర్ణయము | — | ,, | అసమగ్రం | 5673 |
| 25 | బ్రహ్మవిద్యా విచారసారము | పరశురామపంతుల లింగమూర్తి | కాగితం | ,, | 90 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 26 | మహాశేవమననము | పండితారాధ్యులు | కాగితం | అసమగ్ర | 59 |
| 27 | మహావాక్య వివరణము | — | తాళపత్రం | సమగ్రం | 2309 |
| 28 | ముక్తి ముద్రి | — | ,, | అసమగ్రం | 519 |
| 29 | ముముక్షుజన కల్పకము | — | ,, | ,, | 1607 |
| 30 | ముముక్షుజన కల్పకము | — | ,, | ,, | 2283 |
| 31 | ముముక్షుజన కల్పకము — సవ్యాఖ్య | — | ,, | ,, | 2284 |
| 32 | ముముక్షుజన కల్పకము | అచ్చిరామానుజయ్య | ,, | ,, | 2328 |
| 33 | ముముక్షుజన కల్పకము | వేంకటాచార్యులు | ,, | సమగ్రం | 5675 |
| 34 | ముముక్షుజన కల్పకము | — | ,, | అసమగ్రం | 5839 |
| 35 | రహస్య నిర్ణయము | పత్రి వేంకటరామకవి | కాగితం | ,, | 3909 |
| 36 | లింగైక్య వచనము | — | ,, | సమగ్రం | 35 |
| 37 | లింగైక్య వచనము | — | తాళపత్రం | ,, | 165 |
| 38 | వివేక సారము | — | ,, | అసమగ్రం | 5631 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 54 | శివయోగ చంద్రిక | సదాశివయోగి | తాళపత్రం | అసమగ్రం | 5674 |
| 55 | శుకయోగ తారకము | — | ,, | సమగ్రం | 2226 |
| 56 | శైవమత గ్రంథము | — | కాగితం | అసమగ్రం | 4084 |
| 57 | శ్రుతిసార వచనము | రామపాద దాసకవి | తాళపత్రం | ,, | 5823 |
| 58 | షట్స్థల దర్పణము | సిద్ధనామ శివయోగి | కాగితం | సమగ్రం | 3846 |
| 59 | షట్స్థల దర్పణము | ,, | ,, | అసమగ్రం | 3860 |
| 60 | షట్స్థల దర్పణము | ,, | తాళపత్రం | సమగ్రం | 4008 |
| 61 | సర్వార్థ సారము | — | ,, | అసమగ్రం | 2297 |
| 62 | సర్వార్థసార సంగ్రహము | — | ,, | సమగ్రం | 46[illegible]4 |
| 63 | సాంఖ్య చక్రము— సాంఖ్య సూత్రము—త్రివిధలింగ విచారణ—లింగదేహ విచారణ— పంచీకరణము | — | కాగితం | ,, | 3848 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 54 | శివయోగ చంద్రిక | సదాశివయోగి | తాళపత్రం | అసమగ్రం | 5674 |
| 55 | శుకయోగ తారకము | — | ,, | సమగ్రం | 2226 |
| 56 | శైవమత గ్రంథము | — | కాగితం | అసమగ్రం | 4084 |
| 57 | శ్రుతిసార వచనము | రామపాద దాసకవి | తాళపత్రం | ,, | 5823 |
| 58 | షడ్స్థల దర్పణము | సిద్ధనామ శివయోగి | కాగితం | సమగ్రం | 3846 |
| 59 | షడ్స్థల దర్పణము | ,, | ,, | అసమగ్రం | 3860 |
| 60 | షడ్స్థల దర్పణము | ,, | తాళపత్రం | సమగ్రం | 4008 |
| 61 | సర్వార్థ సారము | — | ,, | అసమగ్రం | 2297 |
| 62 | సర్వార్థసార సంగ్రహము | — | ,, | సమగ్రం | 46˜4 |
| 63 | సాంఖ్య చక్రము— సాంఖ్య సూత్రము—త్రివిధలింగ విచారణ—లింగదేహ విచారణ— పంచీకరణము | — | కాగితం | ,, | 3848 |

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
పరిశోధనాలయంలో భద్రపరచబడిన
వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక (డిస్క్రిప్టివ్ కేటలాగ్)

---

1. ఆక్సెషన్ నెంబర్. 79 కాల్ నెంబర్. T 17—4
2. గ్రంథం పేరు — అనుభవ సారము
3. కవి పేరు — పాల్కురికి సోమనాథుడు
4. విషయం — వేదాంతము
5. వ్యాఖ్యాత పేరు — ........
6. తాళపత్రప్రతి/కాగితం ప్రతి — కాగితపు ప్రతి
7. అ) భాష, లిపి — తెలుగు
   ఆ) ప్రతి వ్రాసిన తేది — ——
8. ఆకుల/పుటల సంఖ్య — 58
9. సమగ్రమా/అసమగ్రమా ? — సమగ్రము

10. ప్రారంభం :

ఉ. శ్రీగురులింగ జంగమవిశిష్ట మహామహిమంబు వేడెదన్
శ్రీగురులింగ జంగమము జెప్పె త్రిమూర్తి నిగూఢమైచనున్
శ్రీగురులింగ జంగమ విశేషము లేకముగా దలంచి యా
శ్రీగురులింగ జంగమ. వశీకృతమై మదిగొల్చి సమ్మతిన్.

కం. పరమపరుం పరమేశ్వరు
పరమానంద స్వభావు భక్తి నుతింతున్

గురులింగము హర లింగము
చరలింగము శాంత్యతీతు శంభున్ శరణున్.

కం. భవనాశు పాపనాశును
వివిధేంద్రియ విషయనాశు వినుతింతు సదా
శివు శివదేవు శివాత్మకు
ప్రవిమల విజ్ఞానుభర్గు భక్తి విధానున్.

కం. పశుపాశు వినుర్ముక్తిని
పశుపాత పతిన్ భజింతు పాశుపాశ విశృ
ష్ట శరీరుని ముక్తి ప్రదు
కుశలున్ విశ్వేశు విమలగురు హరుశరణున్.

కం. గురులింగం బుత్పత్తికి
హరలింగము నిత్య సత్క్రియాస్థితికిని ద
చ్చర లింగము మాయ సం
హరణమునకు నాదికర్తలని తలచి మదిన్.

కం. భంగిగ పూజాక్రియలకు
లింగత్రయ మనగు బరగు లెక్కింపగ నే
కాంగంబై చను శ్రీ గురు
లింగం బని త్రివిధలింగం లీనాత్ముడనై.

 

కం. అనుభవ సారం బనగా
మనసిజహరు శుద్ధభక్తి మార్గము వేదో

